# గిరికుమారుని ప్రేమగీతాలు

(1920 — 1928)

విశ్వనాథ సత్యనారాయణ

**V. S. N. & SONS,**
**Marutinager, VIJAYAWADA-2.**

౧

అస్మదీయకంఠమునయం దాడుచుండె
నొక యెదోగీతి బయటికి నుబికిరాదు
చొచ్చుకొని లోనికిం బోదు వ్రచ్చిపోయె
నాహృదయ మీమహాప్రయత్నమ్మునందు.

విఫలితపునఃపునఃకృతవివిధయత్న
ఘావితప్రచండఘాఘాతథావిదారి
తాస్మదీయహృదంతరంబందుఁ దోఁచె
స్ఫురితసంఫుల్లనవజపాశోణసంధ్య.

ఈమహాసంధ్యలో రాగదామయూరి
రమ్యకింకిణికిణికిణిరభసపాద
మంజులవిలాసనృత్యసామ్రాజ్యలక్ష్మి
యగుచుఁ గచ్ఛపీమృదుగీతు లనుసరించు.

౨

ఈమనోహరవీణ వాయించలేక
చేతఁగాన నెంతు నే నశిక్షితుఁడ నంచు
నాలతాంగివిలోలనేత్రాంచలమునఁ
గదలుచున్నది దానిరాగాల మెరుపు.

ఈవిపంచికమీఁద వాయించుకోర్కి
ఎంత యున్నదో నైష్ఫల్య మంతవఱకు
తరుముకొనివచ్చె నాహృదంతర మదేలొ
గాఢనిద్రారతుని నన్ను గలతవెట్టు.

అసలుఁ మ్రోగునో మ్రోగదో ఆవిపంచి
ఏల మ్రోగదు నాదురదృష్ట మనుము

3

ఈజనసమూహామునయందు నే శరీర
మాత్రముగఁ బోవుచుంటి నామానసంబు
నమితతృష్ణాలసం బంతకంత భూమి
మీఁదినుండి స్వర్గానికి మెట్లు కట్టు.

ఏదో నన్ను వెంటాడెడు నెందుకొరకొ
అగునొ జన్మాంతరమ్ములయందుఁ జేసి
నట్టి సంస్కారలేశము ప్రాణములకు
వేచుకొనియున్న యాశయేమో చివరకు.

౪

నిలుకడ యెఱుఁగని వనాంతనిర్ఝరంబు
రీతి నాభావ మీశిలాదృతపథంబు
ననుసరించెడు జలజల మనుచుఁ బొంగి
ఒక్క బొట్టైన మిగులదేమో చివరకు.

ఈనిశీధిని నాచిత్త మొంతదూర
మరిగియున్నది తారక లడ్డువఱకు
నవత లే మున్న దని ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్ను జూచి.

౨

నాహృదాంతక నింపఁబడినదో నీసన్నిహితము
నునుకలలో మైఁగాని నాయధరబింబ
మెఱుఁగ దాస్పృశ్య నగచు చేనిట్టు లుండఁ
గ్రాగి నీగనుచున్న దాకలనే మధువు.

అస్పృష్టా మహదానంద మనుభవింపఁ
(ప్రాం) కీలకీరము బాధ సమ్మిళితము
కావలయుఁబోలె నున్నది

౬

ఈమగాందసమ్మిళనము దేల యచ్చు
మైన విసముసె తెమ్మ యీమాలిసి యది
క్రోలఁగలఁడు సుమీ కాలకూటవహ్ని
కలిత మఁటవె రత్నాకరగర్భసీమ.

ఈభవక్రోధలజ్జాగుణేషణముల
మొగము నాయది కనవచ్చు ముక్తసంగుఁ
డైనవానిబలె నప్రయత్నుఁ డైతి
నైహికాముష్మికముల మధ్యమ్మునందు.

అరుణనృపసదాభనిష్కృపాపాంగకిరణ
భిదురశాతధారావినిర్భిన్నహృదయశకల
ములను గూఢమనఃపాత్రమున నమర్చి
పశ్చిమాశాముఖుండనై పయన మైతి.

౭

ఈలలితసృష్టి నేమొ యీపాలకడలి
యందుఁ గెరటాలు లేవట యింక నెంత
వలపు చేరిన హృదయంబునందె కాని
పాలు పొంగవటే యెంత భాలునకును.

ఈలలితసృష్టి యేమొ యీపాలకడలి
యందు జలజంతువులు లేవఁటైనఁగాని
పాలు తిండిగఁ బెరిగెడి ప్రాణులైన
నెదుగునో యేమొ చిత్రమో యెవ్వఁ డెఱుఁగు.

ఈలలితసృష్టి యెట్టిదో యిందుమీఁదఁ
బాపసెల్లా పరచి నిద్రపట్టకున్నఁ
బట్టినట్టు నటించఁబొల్పరచునటవె
ప్రథితయోగ్యంతరంగేశు పద్మనాభు.

౮

మొదటిసారి నాయెడఁదలో ముల్లు నాటఁ
బడి మహాశూలములుబోలె బాధపెట్టె
దేహము భరించుటయ కష్టమై హృదంబు
రాశి బాడబవహ్ని పరాక్రమించె.

అది మొద లనంతములుగ నిందు దిగఁబడిన
శూలములు ముళ్ళవోలిక సుంత బాధ
పెట్టె యంతట శాంతించు వెనుక ముల్లు
కలఁకిడిన నంతగా బాధ కలుగఁబోదు.

ఇంకఁ గొన్నాళ్ళవునయేని యింతమాత్ర
మైన బాధయుఁ గలుగనియట్లు తోఁచు
నప్పుడు నిశాతబాణము లయినఁగాని
యెదపయిన యోగ్య మగు నేమొ పదునుపెట్ట.

౯

అప్పటికిఁ జిన్నవాఁడ ననంతమైన
యీహృదయశల్యబాధ నే నెఱుఁగ నసలు
తిరుగుచుంటి మధుస్రవంతికల గోనఁ
బొరలుచుంటి మొయిళ్ళగుంపులకుఁ బైన.

ఆతని విచిత్రమ్మయగు నిప్పు డది తలంచ
నే శోకవనాంతరఝురమున నీమలాఁడు
నప్పు డొకపాట పాడితి నందులోని
యర్థ మిప్పటి నాస్థితి కతికిపోవు.

ఈనిశీథిని నాచిత్త మెంతదూర
మరిగియున్నది తెలియక లడ్డువడకు
అవత లేమున్న దని ప్రశ్న యడిగినాను
నవ్వుకొన్నవి తారకల్ నన్ను జూచి.

౧౦

ఇంతలోన వికాసమ్ము లింతలోన
మీలనమ్ము నీ శ్రావణవేళఁ బ్రాగ్ది
శాగగనలంబినీరదచయముతోడ
నామనోవికాసనిమీలనములు పోలుచు.

నికషదృషద్గ్రమునఁ దపనీయ రేఖ
వలె జలదగర్భవిద్యుత్ప్రభల్ గనుఁగొని
నేను స్మరియించుచుంటి వినీలమైన
ప్రణయినీనేత్రముల సితాపాంగరేఖ.

సాంధ్యనృత్యద్దీశ్వరమురజమ్ములవోలె
గర్భఘూర్ణితమంథరగర్జఁ బొలుచు
నీజలదమాల చూచి నాహృదయమందుఁ
బ్రణయమధురగీతమ్ములు బాహిరిల్లు.

౧౧

ఆతఁ డొకవీణ నిచ్చె నాకది సరస
మావిపంచికశ్రుతులను సమ్మృత మున్న
దని సరించిన నాదేహ మున్మృతఖండ
ముది నడించద నాదేహ మనవిభూళి.

నాపురాకృతపాప మేమో పలుకద
యావిపంచిక నే నెంత యాత్రి పొంది
దాని తంత్రులు వినాటన దానిపైనఁ
బట్టశేనంత కోపము వచ్చి నాకు

శిథిల మైపోనని విపంచిక యటంచు
విసరివైచితి దానఁ బృథ్వీతలాన
నపుడు తెలిసెను నాయాత్మయందు దాని
తీవ్రఘాతమ్ము వచ్చి ప్రతిధ్వనించె.

౧౨

ఈ వేళన శరత్పూర్ణిమామృతశశాంక
లలితరోచిర్వితాన మా వేళన ఘోర
ఘనతరాంధకారచ్ఛటాక్రాంతభూమి
అందు సగ మిందు సగ ముంటి నవ్వుగ నేను.

ఈశరత్పూర్ణిమాచంద్రికాసుధాను
వీచిలో నున్న నేను స్ఫారీభవన్న
వీనశంపాలతాకృతి పూనియుంటి
ఈసగము నాకు నాకె కన్పించబోదు.

ఉగ్రరాహుచంద్రార్ధబింబగ్రసనము
పోలె నున్నది నాస్థితి.

౧౩

స్నేహపూరితమై నా చిన్న ప్రమిద
లోన నెంత యుద్దీపించి వెలుంగలేదు
వర్తి యతిపుష్టితస్నిగ్ధ పైడిప్రత్తి
అస్మదీయసుశోభ కీర్తి యపరిమితము.

సుప్రదీపికా కాంతి దిగిభసమూహ
గండఫలకంబులం దలంకారచిత్ర
వల్లులై వెల్గునని లోన బ్రమసిపోతి
అకటా! దీపిక మసగల నంటుకొనదాయె

అంటుకొనెనేని యీదీప మతిశయితర
సాతలోత్ఫుల్లఫణిఫణాచ్ఛవివినూత్న
ఘనచలద్రత్న మగుచు శిఖావితాన
కాంతిచయమున నూర్ధ్వలోకముల ముట్టు.

౧౮

అమృతమూర్తి ప్రేయసీవదనాంచలమున
మందహాసోదయం బగుమాడ్కి నాదు
చిన్నిపూదోఁటలోఁ గూడఁ జివురులెత్తె
నీవసంతప్రభావమ్ము నేమి చెప్ప

ఈపువుందీవబోదెలో నిట్టి ముడుచు
కొని భుజగమనై నిదురవోఁ గోర్కి గలదు
ఓలి పాగసు నాప్రియురాలివోలె నిష్ప్ర
సూనవనలత నాకు శుశ్రూష చేయు.

౧౨

ఇది మహాగిరిస్నుఋువు నా యాశాగిరి
ముడికిపోయెను నాలుక పిడచకట్టి
గమ్యమాకండప్రతత్రోగణము లున్న
నీకునలివేంద్రంలో వచ్చి నిలచినాను.

ఒడ్డు లుగలిన యమృత మోహాలో! ఆరోగ్య
హిమశిరమ్ములపైఁ బ్రవాహించినావు
శుభసత్కృప జీవవాహినియ యమ్మ
నాఘటము కాలశిఖరభిన్న మగుదాక.

అట నదృశ్యమ్మయగు ప్రవాహమ్ము-చోటఁ
బాలములై భావిసమయలాంగలము తగిలి
యాఘటవిభిన్నశకలము లేమి భావ
ములు కృషీవలుహృదయసంకులము లగునో.

౧౬

ఈవిలాసాధికజ్యోత్స్న మెండ నుండి
పవలు తొలిసంజరేకలు పర్వినంత
మధురసీమంతినీచారుమందహాస
వాసనలు చిమ్ము వెన్నెలల్ గాసె బళిర.

చూచుచుండ విలాసపుచూపు లోదవెం
గన్నుగవచిట్టచివరి భాగములయందు
సాంధ్యశీతలమైన యీచల్లగాలి
ముద్దుటిల్లాలినర్మోక్తి ముర్మ్మరించు.

కడు విలాస మీవెన్నెలకాల్వలందుఁ
దేలియాడు తరంగవీథికల నడుమ
నాప్రణయభావరాజహంసీప్రయాణ
మమృతమాధుర్యపుంద్రోవ లంటి నడచు.

౧౭

జగముశీతలమగు దివాచ్ఛాయలందు
నీనడక గొంచెముగ స్పష్టమైనయదియు
ప్రణయసూనపరిమళవ్యాప్తదేహ
కృతకుతూహలులము పులకితుల మేము.

గతదినాంతసంధ్యానటల్లోకనాథ
చరణజనితరావమ్ములు గిరులుకొన్న
నీయురములోనఁ గలసి ధ్వనించుచుండె
మాహృదంతరమ్ములు నీలమసృణమూర్తి.

ప్రణయినీనీలనీరజాభముల కనుల
కాంతికయుఁబోలె గగనమ్ము క్రమ్మియున్న
నీగాఢగునీడల నొదిగి నిలచినాము
శైత్యముగ్ధప్రభూ! నవాషాఢజలద !

౧౮

ఆజగదతీతతేజోవిరాజమాన
మైన నేత్రాంతరమ్ముల నరసి యొకసి
కొన్ని జన్మంబులను మున్న నన్ను నేన
చూచుకొంటిఁ దత్సంయోగశుద్ధశీలు.

ఆప్రణయదివ్యశయ్యపై నవధరించు
రంగనాథుఁడ నూహకు రాని సుఖము
లేమొ యని చూచుకొనఁ ద్రపామధురిమఁ
గలఁగి చూపు నైశ్చల్యంబు గలఁచివైచె.

౧౯

ఏ నాకసమీరబాలుఁడ నీప్రసవము
నాకు సమభాగినిగఁ గూర్చినాఁ డతండు
మాపరస్పరమ్మును స్పర్శమాత్రమునన
పులకితబ్రహ్మపథమునఁ బోవఁగలము.

ఈ యనంతపథమ్మున నెంతదూర
మరుగువలెనొ మాకె తెలియని దది, తలంపు
నందఁగారాని కడల సంధ్యాసమయపు
టరుణరోచులలోన వాహ్యాళి మాకు.

ప్రాగుదితచంద్రబింబముపైనఁ దగక
కట్టినటులున్న క్రొత్తమేఘంపుతునుక
మమ్ము రమ్మనుచున్నది మాటిమాటి
కచ్చటికి మేము నేఁడు ప్రయాణ మగుట.

౨౦

నేను పసివాఁడ నప్పుడు నిత్యబాల
లీలకొఱకు నొక్క గులాబిపూలమొక్క.
నాకుఁ జూపించి యిది నీది నాయనా! య
టంచు నాయేఁకు పుడిపె మాయమ్మ ముద్ది.

అదియ మొద లాగులాబి మొక్కన్న నాకు
నాది యనుభావ మేలనో నాటుకొనియె
నలదిగంతమునందలి నుపదాంకురములఁ
బిలుచుకొనివచ్చి దానికి వీచఁ జేతు.

ఆమొలక గూడ దైనందినాభివృద్ధి
పొంది యొకనాటిప్రొద్దునఁ బూవు పూచె
అందులోని తుషారమ్ము లమృతధునులఁ
టనియె మాయమ్మ తన కది యాయు వంట.

౨౧

నేను నీరమ్ము నామె 'ధుని' యిరువురము
పోయిపోయి చొచ్చితిమి యంభోధిలోన
నంబుధియు గూడ తానె మే మన్న యట్లు
గౌరవము చేసి తనలోనఁ గలుపుకొనియె.

అలసి యీనిర్ఝరతటంబునందు నేను
విశ్రమించితి వనదేవతాశ్రమమున
నామె యాతిథ్య మొసఁగి నా కమృతమైన
యీప్రసవ మిచ్చి నన్ను రక్షించు ననియె.

అది యనుభవింతునా వలదా యటన్న
సంశయకృశానుకీలల సమసిపోయి
దృఢవినిశ్చయచ్యుతుఁడ నాదివ్యసుమము
వాసనలు చూడనే చూడఁబడియె నఘము.

అది మొదల యీప్రసూన మంతంత వాడి
వత్తలై పోవుచున్నది వనరమ యరు
దెంచి పూవునుగూర్చి ప్రశ్నించునేని
యే మని వచింపవలయునో యెఱుఁగరాదు.

౨3

ఇష్టగానమును బ్రయాణమై వేగివేగి
చంద్రబింబమ్ములోఁ జొచ్చి చనుచు నందు
నాకపునిర్మలనిర్ఝరిజ్యోత్స్నలంబు
నిచయపూరమ్ములందు మున్గితిని పోయి.

ఆఘురిణి యొందుఁ బుట్టెనో యని యెచటికిఁ
జారెనో యని సంశయంబులు ఘటిల్లి
యుగ్మగము నిఱువంకల నేగినాము
ఎంత యేగినఁ దూవ కానిపించ లేదు.

పోవుచుండ నే నొకనీటిబొట్టు నయితి
ఆపయినఁ గొన్నినాళ్ళకు నంబుకణ మొ
కండు ననుఁ జూచి 'నదిమొదల్ కానిపించ
లే' దని వచించె నది పట్టలేదు నాకు.

౨౮

ఒకవిచిత్రమ్మయిన స్వప్నకథ నీకుఁ
జెప్పెదన అది ప్రళయనిశీథమంట
పొంగిపోయి సముద్రాలు భూమియెల్ల
బుసబుసని నుర్వులో మున్గిపోయెనంట.

నాల్గుదిబ్బలు మిగిలియున్నవఁట యందు
నల్వురము నీవు నేనును నాజనకుఁడు
నాసఖుఁ డొకండు నిలిచియున్నామఁట ప్రళ
యాతిభీకరమఁట గగనాంగణంబు.

ఇంతలోఁ జూడ మిగిలినా మీవు నేను
నిఖిలవర్ణాతిభీకరస్నిగ్ధములగు
ప్రళయమేఘకాంతులను గన్పడియు నీవు
కన్పడవు తుద కేన యొక్కఁడ మిగిలితి.

అమృతనిభృతమ్ములైన నీయత్నులగాను
నఖిలవిశ్వము నవ్వగ! నా కగపడునంటె
ఈవిశాలమ్మయిన నియీపాలోచ
నములలోనఁ బ్రతిఫలించె నాహృదయము.

ఈమహావిశ్వముఁ బ్రతిఫలింపఁజాలు
మన యనంతత్వగర్భితనుఘనభావ
ఘనికి జన్మస్థలంబు నాతనువు నిదియు
నాజననిగర్భమున కల్పమై జనించె.

అస్మదాదికరేణుసహస్రములకు
దనమహాగర్భమునయందుఁ దాల్చియున్న
ఆయమ యనంతమూర్తి నా కనవగతము

ఈపరిణయపయోరాశి మథించినాను
ఆశ కవ్వపుగిరి మన స్నేహపతిగను
తరచితరచి బలమ్ములెల్లఁ దరిగిపోను
తరచి తరచి భుజమ్ములు విరిగిపోయె.

ఆపయోరాశిలోఁ ప్రళయోగ్రాతిభీక
రముగ విషవహ్నిహాలాహలము సముద్భ
వించె నది యోర్పుగలిగి దేవిగళమ్ము
నందు నిలిపితి నేను జ్ఞానాకృతి నయి.

అది గళమ్మున నిలిపినయపుడె నీవు
నేను నొకటైతిమే పురంధ్రి! శశికళ
సాంద్రశిశిరముగ్ధసుధారసస్రవంతి
మనశిరస్సులఁ దాండవించెనె లతాంగి!

౨౭

ఏ నాకప్రవాహాగామిని యీనాఁ యీనది
మొదలు తుదలేని యీమహాంభోధియందు
నాకసముచ్ఛ్రితశైలతుంగోర్మివలన
నీయుదారతీరమునకుఁ ద్రోయఁబడితి.

దివ్యజంబూనికుంజప్రతిహతరయము
లగు ధునీమతల్లీతరంగాశ్వసితము
లైన యీభూమిఖండములందు నీవు
నాకుఁ గన్పించితి సుధాగసైకమూర్తి

సుఖాల వీదఁగఁబోయిన మనలఁ జూచి
శరధి శాంతతరంగమై స్వచ్ఛవార
శిఖరడిండీరసౌధసుస్థితిని జేర్చి
లాలనము చేసెఁ బొత్తు బాలలవిధాన.

౨౮

ఇచట నొక పెద్దయంబుధి యచట నొక్క
పెద్దయంబుధి యీమధ్యఁ బృథ్విమార్గ
మని ద్వీపాగ్ర్యంబులందుఁ దారాధ్వనికష
శిఖరమగు వృక్షతతిచేత శీతలంబు.

ఆపథమ్మున నీవు నే నరుగుచుంటి
మస్మదీయాననాబ్జంబు లమృతమధుర
ముగ్ధదివ్యగీతములచే ముఖరితములు
పథ మతిసుగమ్య మయ్యె నీపరమకరుణ.

ప్రాగ్దిశాయాతమృదుమందపవనధూత
మైన యీతరుపుష్పంబు లంజలి గొని
సాచినవ్యస్మితాకృతి వేచియుండె
నమృతధుని యపాంనిధి మన యాగమనము.

౨౯

నే నొకప్రసూనవనాలిఁ బూనితిని జేత
నా ప్రీతిసుమంబునందు నే నవఘళింతు
గ్రథితములు నిండు వరుసగా తూరకములు
కోరకములు కుట్మలములు కుసుమములును.

మొదటిమొగ్గలు నీకృపాముగ్ధదృగ్గ
భస్తి నొరుఁగమి వికసించి పరిమళించ
నచటివి భవత్కృపాలోకనాశచేత
నర్ధవికసితమ్ములు తుహినాంశువదన!

ఈ చివరగ్రుచ్చఁబడిన పూలెల్ల విరిసి
నీవదనచంద్రమండలనిసృతామృ
తాభిషేచనమునఁ జేసి యాశలందు
ధృతమధుస్రుతిఁ దేంట్ల కాతిథ్య మిచ్చు.

౩౦

ఈమహానవకాశమ్మున కిచట నేను
అచట నీవును నిలచి మోహనదృగంత
మాలికాపరిసారమున నీమధ్య నున్న
సీమ పుష్పమయమ్ముగాఁ జేసినాము.

ఒకరి నొకరము కలసికో నురికి యీప్ర
సూనపూర్ణావకాశమ్ములోనఁ జొరఁగ
నిర్వ్యారమును బుష్పాకృతు లెనసి లుప్త
భిన్నరూపులమై విడంబించినాము.

తెలిమొగిలుగుంపులోని నిగ్గులవితాన
విరిసిన యచంద్రచంద్రికావిమలరోచు
లొలసి మనపైన నొక్కరి నొకరిలోన
నీపవనచంద్రికలు గ్రుచ్చి యెత్తుచుండె.

పూర్వకనుమల వెనుక చంద్రునకు దాకు
శిఖరములచాలులో సుధాసిక్త మయ్యె
నాశరీరమ్ము సిక్త మైనది భృశమ్ము
అస్మదారోహణావరోహణములందు.

అమిత వేగాన గిర్యుపత్యకము లెల్లఁ
గడచిపోవుచు శిఖరశేఖరములందు
శిశిరపవనమంజులస్పర్శచేత సోలసి
యమృతమూర్తిని దన్మయత్వము భజింతు.

ఇన్ని శిఖరంబులందున నేగి యేగి
యీమహాస్పర్శసుఖ మేలొ యెఱుఁగలేన
ఉన్నతోన్నత మహాశిఖరోజ్జ్వలాగ్ర
సీమ శశిలోన నీవు తోఁచితివి నాకు.

౩౭

సూర్యుఁడను నేను ప్రాగ్దిశాసుందరీము
ఖారవిందసుందరతిలకాకృతి నయి
యుదయ మందితి నాకోస మెదురు చూచె
విడిలు రేకల నీప్రొద్దుపొడుపుపూవు.

ఓదయా స్తనగంబు స్వీయోజ్జ్వలితపి
శంగవర్ణసుందరదళచ్ఛవులచేత
నామెయును ముగ్ధశిశిరకరాలి నేను
ఒకరి నొక్కర మనుసరించుకొనినాము.

మాపరస్పరాలోకనమధురదీర్ఘ
రమ్యసుందరాపాంగసూత్రములచేత
ననిలపథములఁ దేజోమయమ్ములైన
ముళ్ళు పడెఁ బృథివ్యాకాశములకు నేఁడు.

33

ఈసుధార్ద్రశాఖానది యేను కలసి
కొన్న యీయెడ గుటు తిడికొన్నఁగాని
ఆపయిన నేన ప్రవహింతు నధికమూర్తి
నామె యే మాయెనో తెలియంగరాదు.

వేగ మాగి శాంతమ్ముగా నేగుచుండ
నేను శారదస్వచ్ఛవిజ్ఞానమూర్తి
నామె నాయట్టియడుగున నణఁగియుండఁ
బోలు చిక్కణశ్యామజంబాలమూర్తి.

జలనిధిప్రాంత మద్ది పార్శ్వములయందు
బంగరుంబచ్చకం కెలు వదలి సొగసు
చాలుకట్టిన యీరాజనాలపైరు
నందు నామె ముమ్మూర్తుల నవఘుళించు.

౩౮

ఈనవవసంతసమయ మి ట్లేఁగుదెంచి
చిఱుతపువ్వుఁదోఁటలెల్లఁ దిరుగు ప్రణయ
ముగ్ధమూర్తిని మీత్పదాంభోజములను
వికసితసుమాతిథేయ మర్పించెఁ జూను.

యుగయుగాల వసంతపుటొఱపు లెల్ల
దాచికొని భావిమధుసౌందర్యచిహ్న
గర్భితమ్మైన యీసుమకాండము లివి
దివ్యయౌవనవతులట్లు తేజరిల్లు.

ఆతిథేయమ్ముగా లబ్ధమైన యీసు
మప్రకాండమ్ము సమకూర్చి మాలఁ గ్రుచ్చి
ఇది భవత్కంఠసీమ నర్పించినాను
నీవు ధ్రువమండలంబున నిలచినావు.

నీనిజస్వరూపమ్ము ధ్యానింప నెంచి
విశ్వ విస్వాంతరమ్ముల వెదకి వెదకి
కొనకు, నాహృదయాంతరకోటరస్థ
మైన సూక్ష్మాకృతిని నిన్ను నే నెఱిఁగితి.

నేను ప్రాపంచికముగ ననేకకార్య
లగ్నహృదయుండఁబోలె నెల్లరకుఁ గానఁ
బడుదునేకాని దేవి! నాభావ మెపుడు
నిర్లగ్నంబు నీపాదనీరజముల.

నీవియోగ మ్మటంచు నే నిక్కువముగ
నెఱుఁగనే యెఱుంగను నాదుహృదయసీను
నీ వకృత్రిమభావనానిశ్చితాత్మ
వెల్లపుడు మూర్తికట్టితి వే యటనుము.

ఇది యెచటనుండి వచ్చిన దీవియోగ
వహ్ని యెచటి దీసంయోగభావశాంతి
దేవి! నీగీతములు పాడి దివ్యమైన
నీదుసంయోగసుఖవార్ధి నీదుచుంటి.

ఎపుడు నీపాట లే నాలపించలేనో
రవులుకొనును నాదుహృదంతరమునయందు
నీవియోగాగ్ని యపుడు.

౩౨

ఈపవిత్రకార్తికసంధ్యాపవనముల
సోలయు జరఠాతపములఁ గృశోపవాస
కార్శ్యమునఁ దూలిపోయి నాకాళ్ళు సాంధ్య
నృత్యదీశ్వరు నివి తలపించు నెటులు.

ఈపవిత్రసంధ్యాకాలవృతనవారు
కాంసువులు శశక్షతజరమ్యములు నాదు
మేనఁ జందనమునుబోలె మెత్తఁబడియెఁ
గనులు నాయవి నిప్పుకల్ గ్రక్కఁదొడఁగె.

భవమహాపూజఁ దన్మయభావమందు
నాపయిన నీకటాక్షసంతానలహరి
ఇంతి! నీవు దోసిళ్ళతో నెత్తిపోయ
శివశిరఃప్రదేశకృతాభిషేక మయ్యె.

౩౮

ఈయుషఃకాలశీతవాతోర్మి లేచి
కృష్ణవేణ్ణాసరిత్కుల్యఁ గృతనిమజ్జ
నాతిధౌతశరీరులమై శివార్చ
నోపవాసవ్రతం బూని యుండి మనము.

భుక్తపూర్వాహ్ణవేళకుఁ బోయి భక్తి
మోసులెత్తఁగ నాసంధ్యముగఁ బొనర్చి
నట్టి శైవమహాభిషేకావసాన
మునను గర్పూరహారతి పూనినాము.

ఆమహాఖండహారతియందు దీప్త
మైన యిలువేల్పు విశ్వేశ్వరాచ్ఛలింగ
మందుఁ బ్రతిఫలించిన మనయాకృతు లివి
అర్ధనారీశ్వరభ్రాంతి నావహించు.

పారిజాతసృతనిష్యందిసీరజమ్ము మతగ
నవ్యతనువల్లి నిండఁ జందన మలంది
మద్భుజాశ్లేషితాంకసంవలితముగ గ
ళమ్ము కాలాగురుకళంకితమ్ము చేసి.

కమ్రకస్తూరికాతిలకమ్ము దిద్ది
ఫాలసీమ, బంగరుచంద్రవంక పొదిపి
దీర్ఘరమ్యసీమంతవీధికఁ గనులను
గృప విభూతిరేఖలను దీర్ఘీకరించి.

నీయెదుట నిల్చి నిన్ను ధ్యానించుచుండ
మార్గశీర్షపు భూధ్రపరిమాణమైన
మంచు మత్తనూవల్లికాంచలముల
మసలుచున్నదిసూవె సంబంధివోలె.

౪౦

ఈనిభృతపవిత్రైకాదశీనిశాప్ర
శాంతశ్రీకాలనాథపూజాసమయము
లందు ముఖమండపమునందు నందఱివలె
నాప్రదీపము వెలిగించినాను నేను.

ఇవియుఁ జెంగల్వమొగ్గంగో శివకషాయ
పులకితజటాగ్రశేఖరమ్ములో ప్రదీపి
కలు శివాలయముఖగృహజ్వలితములగు
దివ్యతారక లన్న భ్రాంతి కలిపించు.

అస్మదీయప్రదీపికాభ్యంతరమున
ప్రజ్వలితమైనయది పరబ్రహ్మదీప్తి
దేవి! తావకకరుణాప్రదీప్తివలన
నీసమాగతేతరజను లెఱుకలేక.

౪౧

నీవయినఁ బాడినట్టి నావిభ్రుతగీతి
పాడుటయె పరమార్థ మాపైన దేవి
అందుఁ బ్రత్యుత్తరమ్ము నీమందహాస
బాలచంద్రాతపములలోఁ బ్రజ్వలించు.

బాలకులు మూగి వెన్నెలవత్తికొఱకు
శ్లక్ష్ణదృష్టులు వెదుకాడుచందమునను
ముగ్ధహృదయులు నామిత్రములు మదీయ
గీతికార్థమ్ములకు వెదకెదరు దేవి!

౪౭

అల్పబుద్ధు లజ్ఞాతదివ్యాస్మదీయ
భావ లీనురదృష్టదేవతలు వచ్చి
ముగ్ధహృదయుండనైన నన్ మోసగించి
నాహృదయగీతి లాగుకొన్నారు దేవి!

విమలమృదుగీతివైఖరుల్ విస్మరించి
విస్మరించిన దిగులులో వేమరునయి
మత్పురాగీతికాంచలమార్గములను
దిరుగుచుంటి నున్మత్తునికరణి నేను.

౪3

భవదనంతభావములఁ ద్రిభాగశేష
మైన యీదీర్ఘ హేమంతయామినులను
గలతనిద్దురలో స్వప్నకలనచేత
నీవు సాక్షాత్కరించుచుంటివి లతాంగి.

పృథివి యంతయు నీపాదపీఠముగను
నలవరించి యనంతాకాశ మావరించి
అనిలవీచికా స్తంభన మాచరించు
నిన్ను సేవించుచుందు రగ్నివరుణులు.

౪౪

ఈగవాక్షంబునుండి నాపైఁ గవిసిన
వీయుషా రేఖ లివియు మత్ప్రేయసీప్ర
భాతవేళాశిశిరముగ్ధపంకజాత
మృదుకరస్పర్శవోలె నన్ మేలుకొల్పు.

మీలితాక్షుఁడనై సెజ్జ మెదలుచుండఁ
దెలివిపొలముల సొగసు లెల్లలకుఁ దగిలి
నామనసు నేదొ యొక్క-యజ్ఞాతపూర్వ
మైన యనుభూతి కలిగె నాయంతరాత్మ.

అనిమేషార్ధమున భాసమయ్యె నాకు
గతవిభావరీసుఖదుఃఖఘటన లెల్ల
స్వాప్నికము లని సత్ప్రకాశమున నింకఁ
బోదు నని పులుగడిగిన ముత్తెమట్లు.

౪౫

ఈప్రణయగీతి చిత్రమే యేరితోడ
నైన నే నుండ దగ్గరకేని రాదు
నాకు నేకాంతమునయందు నన్ను మరుగఁ
జేసినది హాసభావసుశ్రీలచేత.

ఆమధుగీతి నేను నేకాంతగోష్ఠి
నున్నయప్పుడు నీవు రా నొక్కయింత
కొంక వాగీతిసతి త్రపాకోమలాత్మ
అది మనము నర్మగోష్ఠి నున్నపుడు రాదు.

౪౬

అమృతతీర్థంబునం గ్రుంకులాడఁ బోయి
యీదనుక దేవి నీవు రాలేదుచూవె
నీకయి శశాంకమృదుయామినీపరీమ
శానిలములలోఁ జూచుచున్నాను నేను.

రంజితాధరగతాంబూలరక్తిమంబు
చిఱునగవుతెల్లదనములోఁ జిటిలిపోవ
నెదురుగాఁ దోఁచి నాకు నందిచ్చినావు
చిన్నిశిశువునుబలె తీర్థసేవఫలము.

ఆరయ నందీశ్వరుని యీషదంకురతవి
షాణయుగరమ్యమూర్ధదేశంబువోలె
హైమజలదంబుకొసలఁ గోరాడుచుండి
చల్లనయ్యె మాయెడల నీచంద్రరేఖ.

౪౭

ఏడెనిమిదేండ్ల కూకటు లెదుగరాని
కుఱ్ఱవోలిక భావముగ్ధుఁడను నేను
ఎప్పుడేని నముగ్ధుడనేని యితర
జనుల సంఘర్షణప్రతిచ్ఛాయ లవియు.

కాదయేని చేమంతి ఆఘ్రాణయోగ్య
మైన నిన్నుఁ జుంబింతు నేలా! విలాస
మొలుకు నినుఁ జూచి యానంద మొందలేక
చెలువుఱెక్కల విడిలఁదీసెద ని దేల.

౭౮

నీ వసంతభావాలయవై విశాల
భావసామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీకృప నదెంత భావమేనియును సుపరి
చితమయట్టులఁ దోఁచు నాచిత్తవీధి.

ఈప్రణయభావగీతము లివియు నీకృ
పాతిశయమునఁ బూవులేనట్టిచోటఁ
దావియును క్రొమ్మొగిలులేని తావునందు
శైశిరపృషత్పరంపరల్ సంతరించు.

శ్రీదమై శాంతమై సమీచీనమైన
యవ్యయపదంబునందు సింహాసనమున
నీ వధిష్ఠాత్రి వేలుచున్నావు కమల
పవనములు వీచు నీపదాబ్జములనుండి.

అకట! కామాదులైన యిాయారుపద్వ
తములు వచ్చినవే వచ్చుదారి కడ్డ
మిన్ని దినములుగాఁ బ్రయాణించుచుండి
యవ్యయపదంబు పొలిమేరలైనఁ గనక.

౫౦

ఇవి మహామోహప్రారంభము లిచటనుండి
వివిధకష్టంబులు ననుభవించినాఁడ
అచట ముక్తిపొలాలు నం దెచటఁ జూచి
నను సుఖాలె పరిమళించినవి భృశమ్ము

ఎంతయెంతకష్టమ్ములకేని మొగ్గి
ఎన్ని మోహాలనైన జయించినాఁడఁ
బూర్ణయత్నమ్ము చేసి యీముక్తిపొలము
గట్లునైతమ్ము కొంచెము గనుముకొంటి.

ఇరులు గ్రమ్మ నీప్రొద్దున మఱలఁ జూడు
గడుచుకొన్న ముక్తిపొలాలు వదలిపెట్టి
గెలుచుకొన్న మోహాల నేలలకు వంగి
అకట! సాలోచనాత్ముఁడ నైతి నిట్లు.

౨౧

అతివ! యీకుండ మీఁది విశ్వాగ్నిహోత్రి
నైన నాదుకర్మిష్ఠితకగు సహాయ
పడెద వీవాగ పోయి నాపలితనేత్రి
కోణములు జ్యోతులై వెలుంగు గృహలక్ష్మి!

వచ్చిన వసంతమల్లికాప్రసవదామ
ములను మంచిగంధమ్మంజలుల ఘటించి
ఆహుతిగఁ జేసితిని యిష్మహాగ్ని యందు.



కనుగొనినవారు నను వసంతుని సుమాస్త్రు
గుఱిచి యజ్ఞదీక్షితుఁ డనుకొనిరి గాని
గేస్తురాలవు నీవ యగ్ని సమకూర్ప
నగు నిజానికి కర్మిష్ఠి నని యెఱుఁగరు.

౫౨

పగలె రాతిరివలె తమోభయద మయ్యె
గగనభాగగర్జితమేఘఘటలవలనఁ
గురియుచున్న వర్ష మ్మిది కురియుచుండె
నేగుచున్న నే నిట్టుల యేగుచుంటి.

పటపట నెగుల్చుకొని నేలపైకి దుమికె
నేమొ యామిన్నులవోచ్చట నీశరీర
ముత్పులక మయ్యె నే నుఱు కూహా సేతు
పిడుగ దెల్లుండు నాపైనఁ బడునయేని.

ఆర్ద్రవసనాంతపిహితోత్తమాంగుఁడైన
యేను నభిసారికంబలె నేగుచుంటి
నాచను ప్రశస్తపథ మెచ్చటో

౫౩

ఈవిలయవాతవర్ష పాతావసరము
పూర్వకార్యాంతికాదిష్టమును సుదీర్ఘ
మైన మనజీవితంబునయందు సంది
యములు కలిగింపఁబడుచుండె నమృతమూర్తి.

ఈవిలయవాతవర్ష పాతావసరము
నందు మనపురాకల్పితమైన ప్రణయ
సౌధ మట్టిట్టు కదలి భూస్థలిఁ బ్రపాత
మగునో యనుసందియమ్ము నన్నావరించు.

ఇతడు విలయాధినేత కాడే శశాంక
మౌళి యీదేవదేవుదివ్యాలయమున
నాందిపీఠముకడ భావనాప్రకల్పి
తాస్మదుభయమూర్తిగ సమర్చాత్ముఁడైతి.

౫౮

ఈపయోధితరంగమ్ము లింతవఱకు
పరువులై వచ్చి యొడ్డున విరిగిపోవు
ఈయనంతనైల్యమ్ము తా నిచట నిచటె
తెల్లని కరళ్ళలో వచ్చి తేలిపోవు.

ఈయనంతశూన్యమును నైల్యించె నెవఁడు
ఆమహానైల్యమును దిగంతావృతమయి
ముంచుకొను వార్ధిఁ బ్రతిఫలింపించె నెవఁడు
నన్ను నీవార్ధితటి నిల్పినాఁ డెవండు.

ఈయంతనైల్యమ్ము నాయాశోదర
మందు వ్యాపించె నాజన్మమాది

౫౫

సుకవు కాలమునందు వ్రాసికొని మొరకు
పుట్టిరో వారికీ వసంతము సుమనోజ్ఞ
మైనఁ గానిమ్ము నాకు నీ వన్న మేను
జలదరించున ఓయి! ఆషాఢజలద!

విను మదీయగిరాంవీథి నిలిపి శైవ
సాంధ్యతాండవనూపురస్వనము లొలుకఁ
జేసితిని నీవు మింటికి క్షితికి నేను .
కవుల మైతిమి హృదయదుఃఖములు పాడ.

నీవు జగమునఁ జీకట్లు నిండఁజేయ
వెలుఁగు చొరని యింటిమూలలకుఁ బ్రాకి
ముసుఁగుమప్పటిలోఁ గన్ను మూఁతవెట్టి
పొదలు పెనుచీఁకటిని శాంతి వెదకికొందు.

ఇది ప్రసవజన్మ మెత్తిన దిదియ చాలు
నన్ను నవహైమనిగళబంధములచేతఁ
దనయెడకు లాగికోఁ బట్టుత్రాళ్లఁ గూడ
నేటికో నన్ను బంధించ నింత తివురు.

ఇది యొకఁడె బంధ మని మది నెంచికొంటిఁ
గాని యీరెమ్మ యీకొమ్మ దీనిచివర
పొలుచు చివురులు పిందెలుపో యివెల్ల
నన్ను లాగఁజూచెడిని బంధములు వేసి.

నిక్కముగ ననతిక్రమణీయమైన
దైవమును నూర్ణనాభికృతమగు చెట్టు
వాగురఁ దగుల్కొని కృతమహాగసుఁడను
వెలికి లోనికిఁ గాక తపించుచుంటి.

౫౮

అసలు నడిసంద్రమునందు గేహంబు కట్టి
యీతుపానుల గని భీతి యేల పొంద
ఒక్కవేళ యీవార్నిధి యుబికివచ్చి
నన్ను ముంచునే యని యనుకొన్న నేమి.

నాగృహము గుర్తుగానున్న నావికులకుఁ
దొలుతరోజుల మనసులోఁ గలఁకెగాని
ఈమహావార్ధి కదియు తుఁదా మొదల గ
ణించుకోనందు రెండు కన్నీటిబొట్లు.

ఇపుడు బిట్టుగ రేగెడు నీతుపాను
క్రమముగాఁ దగ్గిపోవును కాక యేమి
చేయఁగల దూరకే పొంగి శిశిరమైన
కెరటములమీఁద నన్ను నూగించునేమి!

౫౪

ఎట్టయెదురుగఁ దోఁచెను గొట్టవచ్చి
నట్లు కోసిన కొండకొమ్మనఁగ నీశ
రత్నమయకింపిదసితనీరదము వాయు
పథముకడఁ దాఁకి తారకాసనము మిగిలి.

కాన్గుకొమ్మల కోనఁ జీఁకటులు ముదిరి
ముడులుపడి నేలపై రాలి పడినయట్లు
నీలచికురములు చల్లనిడ లోలసె
మఱల నిట విశ్రమింపఁగ మనసు పుట్టు.

పొదవెలికి వచ్చినట్టి లో నిదురవోవు
శ్వాపదముకాలిగోరు నా నగలు మొగిలు
చాటుబడి యర్ధవిస్పష్టచంద్రరేఖ
నాయెద సమాశ్రయించు పునారిరంస.

౫౬

ఈ విశాలము నందనోపేత మమృత
దంబు సుఖనిధి స్వర్గ ఖండంబు దీని
మృదుహృదయమందు నేన నిర్మించుకొంటిఁ
గడు నదివ్యవస్తువుల సంఘటనపరచి.

ఈ మయానిర్మిత స్వర్గ సీమయందు
నిఖిలవర్ణ సుందరతర స్నిగ్ధమైన
హరిధనుఃఖండ ముదయించె నాధనుస్సు
చివరలును వానజల్లులచేతఁ గరగె.

నాస్వరుత్తమ క్షేత్రసంతతులు రాజ
నాలు పండెను తొలివిత్తనాలు పండె.

మనవి వాహాని కచ్ఛపోసినదిసూవె
సకియ ముగ్ధవిస్రబ్ధ యాజన్మియావృ
నియతభావృఁడనై యొడల్ నిమురఁబోవ
నాయొడలు నాల్కతుద చాచి నాకఁజొచ్చె.

తరచి గిలకొట్టరాదను దరకమీఁగ
డలును చిక్రుపలై వెన్నయు వెలలరాదు
సుప్రసన్ననిత్యము లామె చూపు లట్లు
వికృతిరహితమే తత్ప్రకల్పితపయస్సు.

ఉజ్ఝితాఘదివ్యమ్ములౌ నుభయసంధ్య
లను బరస్పరసేవావిలాసనేత్ర
లగు భవత్సితాపాంగపయఃప్రవాహ
వీచికాసుఖస్తిమితవిలోచనుఁడను.

౬౧

కృత్తమహింసదితిప్రదోన్మత్తమస్త
నిహితమై యసృగ్గ్లాఘాభిపిహితమైన
లె శివభార్యాపదమ్ములు మసృణమయ్యె
మనమొసఁగు పూజాకుంకుమమ్మువలన.

ఒడ్డిగిలఁబెట్టి కొండితీసి యుజ్జ్వలింపఁ
జేసిన ప్రదీపికాకాంతిఁ జీఁకటులును
పంపలై కపురాగతివెలుఁగులోనఁ
బొదలె జ్యోతిస్సులన దేవిపదనఖములు.

ఈశరద్రాత్రి శైలకన్యాసుహాస
రంజితాత్మలము శివశిరస్సుమీఁద
సగము నిండిన చిన్నారిచందమామ
మొగిలుచాటున వెన్నెల మూసబోసె.

౬౨

వానకోయిలనై నే పిపాసఁ దగిలి
వృతవినీలాబ్దమున నొక్క ఱెక్క విచ్చి
ఎండ పలుచనిపొగ నొక్క యెఱక చాచి
పైకిఁ జూచుచునుంటి నీరాక వేచి.

అతికృశీభూతమగు దేహయష్టితోడ
శారదాచ్ఛనీరదముక్తజలకణంబ
నైన నీ వేగుదెంచి నన్నంటినావు
లేమ ! నీ వంటినట్టులే లేదు నాకు.

శిశిరమధుమాసములు గతించి కృషికులు పొ
లాలు దున్నిన నాగేటిచాలులందు
ఱెక్కలను జాచుకొని నీటిచుక్కనైన
నీమృదుస్పర్శలో మేను నించుకొందు.

ఈ చిఱుతముత్తియము చూచి యెల్లవారు
ఏమహావారిరాశిలో నిది దొరకెను
ఏమహాశుక్తిగర్భాన నిది జనించె
నని మహాశ్చర్యచేతస్కులైరి దేవి!

శుక్తిగర్భమ్ము చేసిన సుకృత మేమొ
దివ్యరత్నపరీక్షకుల్ తేరి చూచి
ఇది మహాద్భుత మనిరి యేద్వీపమందు
చిఱుతముత్తెమ్ము లిట్టివి మెఱుఁగ మనిరి.

మౌక్తికాచ్ఛప్రభల్ చూచి మనుజు లెల్ల
స్వాతి తొలివానచినుకెంతస్వచ్ఛ మనిరి
కాని తచ్ఛుక్తిగర్భసంకల్ప మేమొ
ఎఱిఁగినది స్వాతిచినుకొక్కఁడే! శుభాంగి!

అస్మదంతరసంభూతమైన కోప
మనెడు వహ్నికణ విసరితి నామెమీఁద
ఆమెయును నోర్పుతోఁ గాలిసంత కాలి
ఎంత కటికతనమ్మని యిడిసిపోయె.

కడగి నామెద నిండి పొంగారు ప్రేమ
పూర మాయమమూర్తిపై ధారపట్టి
గ్రుమ్మరించితి నామె నన్ గ్రుచ్చియెత్తి
నీహృదయ మెంత చిక్కణనిభృత మనియె.

ఒకమహాసంస్కృతిఫలంబు నొందువేళఁ
దలఁతు నామె నాకాలిసంకెల యటంచు
ఒకమహాసంస్కృతిఫలంబు నొందువేళ
మచ్ఛిరస్థపూజాకుసుమం బటంచు.

౬౨

కరములందునఁ గరములు కలిపి వైచి
ఇట్టె మనమిర్వురము చెట్టు కట్టినాము
చిగురునఁ గొసాకులోఁ జిన్నిచిన్నిపూలు
కాయలును పిందెలును జూచి కాచినాము.

ఈ తరువునందుఁ జివురులు లేఁతలేఁత
పూపమొగ్గలు తావులు బుగులుకొన్న
పువ్వులుగ నన్నుఁ జేసి నీవు తరులగ్న
కంటకాకృతి వైతివి కరుణమూర్తి!

నిరత నీలాకొండయంచుల దొరలివచ్చు
నెత్తిపోతల వేగాన నెగురు సీమ
హాంబుశీకరసంతాన మాకసమునఁ
జిలుతకొన్న్యావజల్లుతుంపురులవోలె

తుంపురులజల్లులందుఁ ద్విషాంపతిఘృణులు
లోలసి కిర్మీరితంబైన వ్యోమసీమ!
నైంద్రకార్ముకఖండసహస్ర మొప్పి
చివురు తొడగెను మింట మాఘవతలక్ష్మి.

నీటిజల్లుతుంపురుల పందిరులలోన
ఇంద్రధనువుల తోరణా లెగురుచున్న
పెండ్లిపందిరి నన్ను భావించుకొనుచు
నాయొడలె నాకుఁ దెలియ దీనాఁటిపగలు.

ప్రతిదినమ్మును సాయంసరాగరమ్య
జలధరచ్ఛాయలందున నిలచియుండి
అరియ మఱిమఱి యనిపింతు నామెచేత
నేను నిన్ను ప్రేమించుచున్నా నటంచు.

నాచిఱుతకందుల హాసమ్ముఖోచితంపు
నెలపొడుపు లేఁత పలుచ వెన్నెల చివుళ్ళ
లోన మా ప్రేమ నిశ్చితంబైనయదియ
ఈవిధి దినమ్మె ననిపించు వేళ నేను.

ఆపలుకులోన నెప్పటిదో పురాను
భవ మొకండు మనఃపథిఁ బ్రాఁకులాడి
యిదిగదా నన్నిటుల ముక్తిపదముత్రోవ
వెలయఁ జేసినదని యనిపించుచుండు.

౬౮

నేను మాయమ్మగొడిలోన నింతవాఁడ
నై నయపుడు నాలోన నీయఖిల మిసిమి
యుండెఁగావలె నేఁటి కిట్లుబికివచ్చి
చిత్రచిత్రభావాకృతుల్ చెలువుమిగిలె.

పాడుటకు మున్ను కంఠగర్భమున నెలుఁగ
రాక యవ్యక్తమైయున్న రాగమట్లు
విభృతచిక్కణమూర్తుంబు నీవు నిసువు
లిన్ని సుఖములు దాగినా రెటుల దేవి!

అస్మదీయహృదబ్జనాళాంతరమున
బీజరూపమ్ముగా నుండి విశ్వ మింత
ఇది బహిర్గతమగుదాఁక యెఱుఁగలేన
అంత యవ్యక్తశిశుమూర్తి నైతి నెట్లు ?

౬.

ఇవి యథాకంఠనిర్గతం బవి తథావి
లిఖితములు ప్రేమగీతముల్ దేవి ! నీయ
పాంగరేఖాచలన్మందహాసవాహి
నీతరంగాల నాముగుండియ చలించి

ఈవిశాలకృష్ణాతటినీవిలాస
మృదుశబలశారదాంబుసంపదలఁ గదలు
లాడు జమిలినావలకు సామ్యము కుదుర్తు
నీప్రశాంతాస్మదుభయమూర్తి ప్రథలకు.

ఇది విచిత్రమ్ము నాకు నాకే మదీయ
హృదయమున నన్ను నేఁ బ్రతిష్ఠించుకొనుచు
స్నిగ్ధదేవతామూర్తిని నేన పూజ
చేసికొందు నన్ను వరలక్ష్మిదయితుని.

౨౦

ఈయనంతప్రయాణమ్ము నేగుచుంటి
నా! ప్రతిమలుపునందు నీవై యిదె కను
మింత దూరమ్ము వచ్చినా వీ వటంచు
జ్ఞాపకము నాకు చేయుచున్నావు దేవి !

ప్రతిమలుపునందునం జానపదుల బాల
వలె నసంస్కృతములు రాగివైన కేశ
ములును నివ్వెఱవోవు దృక్కులును ధూళి
పిహితదేహమ్ముతోడఁ గన్పించుచుంటి.

కనులఁ బొడిచితి వీయనాగరకజాన
పదకుమారికామూర్తివి ప్రథమమందు
నేను నివ్వెఱవోతి నూహించుకొలఁది
నాకనుగొలంకు నిండుచున్నది జలాన.

ఇది ప్రతిన పూనితిన ప్రవాహింపఁజేతు
నీయడుగుడమ్ములందు ననేకనాక
వాహినులు వానినీగముల్ ప్రాశనమ్ము
గాఁగ భావ్యాంధ్రదేశసత్కవుల కెల్ల.

మధురహైమచ్ఛదాభిరామయును మదవ
తీరణన్నూపురక్రేంకృతిప్రశ స్త
కూజితయునైన హంసిపైఁ గూరుచుండి
భావిశారదామూర్తిని ప్రజ్వలింతు.

ఆసరస్వతి నిన్ను జిహ్వాగ్రసీమఁ
దాండవింపించినట్టి విధాతృమూర్తి
నన్ను నాసృష్టి నేమి యనంగఁగలరొ
మనశిశువులైన భావిసంపన్నకవులు.

అమృతకేశీరహోనాథుఁడైన యపుడు
నీ చెవుల నూదుచుండు ననేకప్రేమ
గీతములు నీవు విని యరమూఁతకనులఁ
బ్రతిప్రణయగీతమున కనుమతి యొసఁగెదు.

నేను వినుపించుచునెయుందు నీకనులని
మొగ్గలనుబోలె నిదురలో మూఁతపడును
ఆప్రణయగీతి యానాఁటి కనుమతింపఁ
బడక మరునాఁటికై యాపఁబడును దేవి !

శరదమలమేఘముగు నాకసంపు సరసి
శాంతమై తేలియాడెడు చందమామఁ
బోలె నేకదృక్కులను నీమోము కనుచుఁ
గనుచు నేను నిదురపోదుఁగావలయును.

౭౩

'బాపిబావ' లేఖయొకండు వ్రాసినాఁడు
నేను ముక్తాచ్ఛహారమధ్యాన వెలయు
హరివిపీలనాయకమణినంట సితస
రఃప్రదేశలోలేందీవరంబునంట.

అతఁడు మధువాక్కువగు పరిహాసకాఁడు
కించిదరుణకపోలము కెలని పుట్టు
మచ్చనఁట శక్రస్త్రీకుచమండలమునఁ
గరగుటకు సిగ్గువడు చూచుకంబు నంట.

హరిమణీందీవరమ్ములు నచ్చమైన
పుట్టుమచ్చయుఁ జూచుకమ్ము నివి నేనె
ఆశబలవర్ణవర్ణితమ్మైన దేదో!

ఊహాపై నూహ లల్లి నే నొక్కరుండ
నున్నయప్పుడు బంగారుచిన్నిమేడ
బురుజు లోకొట్టియా! సర్వమును మహాంధ
కారమున భావవీథిలోఁ గట్టుచుంటి.

ఆవిలాసైకరమ్యసౌధాగ్రసీమఁ
బైడిగొలుసుల యుయ్యాల పట్టిమంచ
మందున సుఖైకతల్పుఁడనై మహాంధ
కారమున సుఖస్వప్నముల్ గాంచుచుంటి.

బహుళజన్మాత్తసంస్కారగర్భమైన
ఒకవెలుఁగు నాదుగుండెలో నొదిగియుండె
ఆవెలుఁగు సోకి నామేడయంత కరగి
పడతి! నే నింతలో దిశాంబరుఁడ నైతి.

౭౫

ఒక్క యప్పు డీమేను మహోన్నతంపు
పర్వతమువోలె మిక్కిలి భార మగును
మఱియొకప్పుడు నవసుకుమారకుసుమ
సదృశమై గాలిపొరలలో జారిపోవు.

అది మహాపర్వతమువోలె నమితభార
మైన వేళల నాకు భయంబు లేదు
గాలిలోఁ బూవురేకునుబోలె నెగురు
వేళ నాయాత్మ యిది భయావిష్ట మగును.

ఉండి యుండి యే వేళనో ఒక్క మరణ
మనుచు లేక యెదో రుజ యనుచు లేక
కప్పూరమువోలె నీమేను కరగిపోయి
చనునో యేనిద్రయో మేలుకొనఁగఁబడక.

౭౬

పలుకరాని జ్యోతిస్సు నాప్రియమెల్లఁ
గావ్యరూపమ్ముగా నిట్లు కరుగఁబోసి
ప్రళయకాలనిగూఢగర్భమ్మునందు
దీనియాకృతిఁగూర్చి చింతించుచుంటి.

ఈమహాద్వైతభావ మిదింత కుదిరి
కుదురనీయద యేలొ నాహృదయశాంతి
ఈసుకావ్యాకృతిం గుదియించివైచి
దివ్యమగు జ్యోతిగా సమర్థింప నెంతు.

విగతతృష్ణుని న న్నింత వెక్కిరించు
నీమహాతృష్ణ

౭౭

ప్రకృతిసిద్ధమ్ముగా నాకు వర్షఋతువు
చరమసంధ్యలు ఇవి మనోజ్ఞమున కెక్కు-
నామనస్సు సమ్మర్దజనమ్ము నెడలి
హృదయకుహరమ్ములో శాంతి వెదకికొనును.

ఉదయసంధ్యలకన్న నాకూహ సేయఁ
గాఁ జరమసంధ్యలే భావగర్భితములు
గాఁ గనంబడు నీ మొగిల్ కడల మెరసి
కనకగిరిసానువులఁ బోలెఁ గానిపించు.

౭౮

శ్రీమధురమూర్తులును చిరంజీవులైన
యట్టి వత్సలాస్వభావు లమృతప్రణయ
వారిరాశిని పుడిసిటఁ బట్టినారు
ఎఱిఁగిన జనమ్ము నిర్వ్యాజయే భజింప.

నిభృత మస్మద్ధృదబ్జమ్ము నిండియున్న
ప్రియతేజ మాపుణ్యదంపతులయెడల
సాభిలాషమై వాక్ప్రవాహములు కట్టె
నమృతమయములు స్నిగ్ధభావాలసములు.

అతిపవిత్రమ్మయగు ప్రణయమ్మునెడల
నింత సుస్నిగ్ధుఁడైన న న్నీవు నూత్న
మధురమధురకటాక్షసంపదలఁ జూచి
నన్ను దివ్యునిఁ జేయుచున్నావు నరుని.

౭౯

మధుమధురమంజువర్ణ గుంఫనము కల్గి
సంస్కృతిది వ్యర్థసూచ్య భావమ్ము కలిగి
పరగు కల్యాణిపైఁ బాడఁబడిన తెలుఁగు
పాట యొక్కటి నీదురూపముగ మారె.

ఈసుకవినైన నాజన్మమెల్ల దేవి !
అచ్చఁపుఁదెలుంగుపడఁతి వైనట్టి నిన్ను
మఱల నాతేనెపాటగాఁ గరగఁబోయఁ
ద్వత్పదార్పితమ్ముగ నేను ధారవోతు.

నాకు నక్షత్రముల దర్శనంబువలన
నీపవిత్రనిశావేళ నిరసిపోగా
హృదయపద్మంబు పాపభూయిష్ఠమును దు
ఃఖాభిభూతమ్ము నాబ్రతుకు కరయుకొలఁది.

పొలఁతి మనపెండ్లి కట సాక్షిభూతుఁడైన
గార్హపత్యాగ్ని మఱల నాకగమువెంట
నక్షతలచేత హవ్యకవ్యములచేత
నర్చితుఁడు కానెలేద యే మనఁగవలయు.

మూఁడువహ్నులు నర్చితంబులుగఁ బొందఁ
దగినవఁటవె ! సావిత్రివర్త్మంబునందు
మెఱయు తారకాపదముల మేలిస్థితులు

౮౧

శివజటాకృతశ్యామలచ్ఛవిఁ దనర్చి
కోసదేరి యీసుస్నిగ్ధకోమలంబు
నవజలదమూర్తి; చరమసంధ్యను శిరస్థ
తరుణశశిరేఖచేఁ బవిత్రం బొనర్చు.

చరమసంధ్యయుఁబలె ఫాలచంద్రరేఖ
నీలజలదకేశప్రసూనజాలమగుచు
మూర్తి మత్కులపాలిక ముగ్ధహృదయ
ఈచరమసంధ్య నన్నె యూహించుచుండె.

నీవు వేసంగినదివోలె నీజనుస్థ్న
లాని కేగితి సాగరుంబోని నేను
కల్పితోహాతరంగలఁ గదలి కదలి
మఱలమఱల నాతో నేనె తిరుగఁబడుదు.

సాధుజలసరిత్సాగరసంగమమ్ము
వోని మననాఁటికలయికలోని నాదు
నాక్రమణ నీదునొదుగుట యందమైన
యీనిశావేళ నేను నూహించుచుంటి.

ఈమధురపూర్ణిమాయామినీమనోజ్ఞ
వేళలో నీవు పరచిన వెల్ల సెజ్జ
పైనఁ బడుకొని మీలితమ్మైన లోచ
నములతో నిన్నె మనసులోనఁ గనుచుంటి.

ఇంతలో నాపయినఁ బువ్వువృష్టి కురిసె
నవ్యమృదుమల్లికావాసనాతరంగ
గుమ్ముమని వచ్చి నాహృదయమ్ముదాఁక
వాచికొన్నది ఘ్రాణేంద్రియప్రవృత్తి.

కనులు తెరచితి నీముగ్ధకరమునుండి
నాపయినఁ బూలు రాలుచున్నవి విముగ్ధ
హృదయుఁడను రాలుచున్న పూ లేరి పొదివి
కొంటిఁ గవుఁగింట ముద్దిడుకొంటిఁ బెదవి.

౮౪

ఇనియు మార్గశీర్షపు శుక్ల విదియ హైమ
శైలతనయాహృదీశ్వరమౌళికృతమ
హాభిషేకశైత్యమ్ముల నపుడె విరియఁ
జల్ల మొదలిడె నీబాలచంద్రరేఖ.

తన్నికటదేశసంస్థితతారకావి
ముగ్ధమోహనరేఖలో ముడుతలు పడి
నాదృగంతమ్ము కుంచుకున్నది దిగంత
రములయందు ని దేమి శైత్యములు గ్రక్కు.

ఈమహాశీతమునయందు నేమొ నాకు
గళవితీనస్వరమున గద్గదిక వొడము
నస్మదీయదేహమున రోమాంచ మొదవుఁ
జలితలోచనముల బాష్పములు స్రవించు.

౮౫

మబ్బులఁ జూడగా నవాషాఢ మరుగుదెంచెఁ
దరుణచిక్కణశ్యామలాబ్దములతోడ
మబ్బుల మేఘుని మొదలు శంపాప్రగాఢ
ఘనపరిష్వంగములయందుఁ గాంతి పొందు.

అస్మదీయవినీలదేహమ్ముఁగూడ
నాశుక్లాంగనాబాహుహైమచ్ఛవిసుప
రిష్కృతమయి రమ్యమోహనాకృతి నహించు
నన్ను నట్టి సిగ్గు పుచ్చుచున్నదియుఁగూడ.

నాకు శంపాలతాంగి సౌందర్యరాశి
నన్నుఁ జూచి యాశంప సౌందర్యమూర్తి
వనుచు నగి పరిష్వంగించు.

ఓయి ఆషాఢజలదుఁడ! ఓయి!! నీకు
నాకు సామ్యమ్ము కలదు విన్నావఁటయ్య!
నావలెనె నీవును కులాంగనను గుఱించి
ప్రణయసుకుమారగీతముల్ పాడుచుందు.

నీమధురగీతములు విని నేలయందుఁ
బులకలునుబోలెఁ బచ్చనిమొలక లెత్తు
నామధురగీతములను విన్నట్టివారి
ముగ్ధహృదయాలు క్రొంగ్రొత్తమోసు లెత్తు.

నీయురుగుఁకు విప్రలబ్ధలౌ నెలఁతుకలను
గళవళింపించు నట్లె నాకప్రమగీతి
కలును నసధర్మ్మలకు బాధ కలుగఁజేయు
ఓయి! నీవలె నీలదేహుఁడను నేను.

౮౭

నీవు నామనస్సున నిల్చినావు దేవి !
నామనసుంగోతులును శారదామనోజ్ఞ
చరణమంజీరసికసురంజత్క్వణాంక
వలితములు నాప్రణయగీతి వంపు తిరిగి.

నీవు నాగుండెం గదలించినావు దేవి !
దేవి ! తత్ప్రత్యూలగు సర్వదేవతలును
అనభిహుతములు హవ్యకవ్యములు పొంది
నాయకర్మిష్ఠత క్షమించినారు దేవి !

నీవు నామేనం బెనవడినావు దేవి !
నాతనూలతపైన మాన్మథవిలాస
చిహ్నములు తోంచి నాదీర్ఘ జీవితమ్ము
మనపరస్పరప్రణయాంకమును వహించు.

తతపురాకృతకర్మానుగతి మదీయ
భాగ్యము వినిర్ణయము చేయు బ్రహ్మముదల
ననుసరించిరి నాదుపిత్రాదు లగ్ని
సాక్షికంబుగ నిన్ను నాచానఁ జేసి.

అస్మదీయపురాకృతమైన పుణ్య
మింత యని యిట్టి దని నాకు నెఱుఁగబడని
వేళలో నీవు మత్కంఠవిదళనక్రి
యార్థకల్పితశిల వని యాడుకొంటి.

కర్మసిద్ధాంత మనగతగతిఁ జరించి
నాసుకృత మూర్జిత మ్మన్న జ్ఞాన మొదవి
ఈమహానందకు ప్రస్వర్థాము మంజ
లిప్రణీతమందాకిని శ్లేషణింతు.

మన్మనోజ్ఞ తనూవినిర్మాణకలిత
భూతపంచీకరణవేళ మొగ్గుపడి గ
నమ్మ కావలెఁ గాక యాషాఢగతమున
కంబుమున కేల నాహృదయంబు కరగు.

ఈజలదముఁ డింతకునుమున్నె యెన్నొ పొందెఁ
గానుకలు మద్గిరాంవీథికలఁ జరించి
ఇతని కార్ద్రుఁడనైన నాహృదయపుటము
వీఁ డెఱుఁగనేమొ మఱిమఱి వెంబడించు.

మున్ను నర్తనశాలాభిముఖుఁడనై మ
హాంధతామిస్రశర్వరియందుఁ గీచ
కుండనయి వీథిలోన లీనుండనైతి
మఱలఁ దనలోనఁ గలుపుకోఁ దరుమఁజొచ్చె.

౯౦

ఈ ప్రణయగీతి మును పల్కరించినంత
నాయెడ మహానురక్తి యునాఁ బరువులు
పెట్టి నచ్చెడి దిప్పుడు పిలచి పిలచి
నాగళము సన్నవోవుచున్నదియుఁ గూడ.

మనము నూత్ననూత్న ప్రణయాంబుధులందు
ముగ్ధులము సచేలస్నానములు పొనర్చి
తఱిని బహుధాభిలషితభేదప్రహరణ
మంచు నాగీతి పొంగెడి దబ్ధిపోలె.

ఇప్పుడు ప్రశాంతసంసార మిద్దఱమును
నీవు నే నయి నేనును నీవు నై ప
రస్పరహృదంతరాళవిశ్రాంతి పొందు
వేళ నే మయ్యె నాగొంతు పిలచి పిలచి.

౯౧

నీవు తొలినాఁడు నామనోనిభృతనిధి
జన్మజన్మాంతరపునీతసంస్క్రియాప్ర
ణీత మానందశకలము నీమనోజ
తేజసంస్పృగ్ణకలిమి వెల్గించినావు.

అది క్రమక్రమవర్ధితమై దిశాంత
రములు రోదసీకుహర మాక్రమణ చేసి
సగగ నానాగపదత్రివిష్టపము పెరిగి
నైకతారకాపథములదాఁక పోయి.

ఈయనంతవృద్ధికి విసుగెత్తి తుదకుఁ
గుంచుకొని కుంచుకొని వినిగూఢ మస్మ
దంతరాత్మప్రవిష్టమై యుండె మఱలఁ
దొల్లిఁటానందశకలమై తొంగలించు.

౯-౧

మార్గశీర్షాంతవేళ గుమ్మసులు పూచి
యీయుషఃకన్యకను నలంకృతులు సేయు
మొగమునను లాగికొన్న దీముద్దరాలు
మిహికపుఁ సన్నముత్యాలు మెరియుచుండు.

నాపుప్పుందోఁటలో లతాంతములు వదలి
కోరడులయ్యునుఁ బూచిన గుమ్మసులనె
నిలుకడలు చేసికొని కౌఁగిళ్ళు వదలవు
తేఁట్లజంపతు లింతగాఁ దెల్లవారి.

మంచుదమ్మిన్న నాపోవు మార్గపార్శ్వ
కము లలతికాసతులు నన్నుఁ గౌఁగిలించి
నాయొడలు జల్లుమనిపించినవి విలోచ
నాగ్రమీలనసౌఖ్యమ్ము లావహించి.

౬3

సగము మేఘావృతమ్మయి సగము హరిణ
లాంఛనమనోజ్ఞశశిగవిలాసచంద్రి
కావృతమ్మయి యీవ్యోమ మతివ! మనము
కౌఁగిటం గ్రమ్ముకొని యున్నకరణిఁ బోలుచు.

ఈజలదమాల వ్యాపించి యీశశాంక
కలితగగనార్ధభాగమ్ము గ్రమ్మ నేను
ప్రేయసీ! నిన్ను మదురఃపిహితవదన
నాక్రమించుకొన్నట్లుగా నవఘుళించు.

దివ్యగంగాధునీపరిదీప్తమంబు
ధరసమాక్రాంతము శశాంకతరుణచంద్రి
కావృత మిమ్మవియత్పథ మస్మదీయ
ప్రణయచారిత్ర మఖిలమ్ము ప్రతిఫలించు.

౬౮

ఒకమహాగాఢమును శిశిరోజ్జ్వలంబు
నగు నెదో పరిష్వంగమునందు మనల
ప్రాణపంచకయుగళమ్ము వాంఛ సేతు
దేవి! దశధాప్రతున్నంబు కావలె నని.

అప్పు డానిత్యవస్త్వభిన్నాత్ములమయి
వెలది! యీనాటి మనప్రేమబలముచేత
మనభవిష్యత్ప్రజాసుకుమారహృదయ
ప్రణయచరితముల్ పాలించవలయు ననియు.

౯౬

నీపరిశాంతాచ్ఛనిస్తరంగప్రణయప
యస్సుధారాశిలోపల నస్మదీయ
ముజ్జ్వలప్రేమనౌకము నున్నచోట
నున్నయట్లుగఁ గదలకయుండె దేవి!

అదియు నిశ్వేచి నిర్వాయు వస్మదీయ
నౌక యీయొడ్డు పట్టుకొన్నది సమీర
మొక్కపొర లేదు తెరచాప లూది యూది
చిన్నిగాలిపొరల్ కదల్చితిని నేను.

బహుప్రయాసమ్ముపడి పరవళ్ళు త్రొక్క
ని స్తరంగభవత్ప్రేమనీరరాశిఁ
జిన్నరితరంగచాలు సృజించినాను
చిన్ని నానౌక యీయొడ్డు చేరుటకును.

౯౬

లలితశృంగారమధుమాసలక్ష్మివైన
నీవిలాసైకపాదచిహ్నితసుమమ్ము
నాయెడఁద పూవుదోఁట యనంతకోటి
గాసుమపరీమళముల శ్లాఘ్యత నహించు.

ఆపువ్వుందోఁటను బికమ్మనైన నాసు
మధురపంచమగీతిలో మణఁగియుంటి
మీపువ్వుందోఁటతోఁగూడ నీవు నేను
సకలమైనట్టి యీప్రపంచకముతోడ.

అందఱు నిది యున్న దనుచు లే దనుచు లేక
యున్న దని యుండిలే దని యిన్ని గతుల
రమ్యమద్గీత మిది పరబ్రహ్మవోలె
నీయతికృపచేత విచారణీయ మయ్యె.

౯౭

నీపయిన నేను పాట లెన్నియొ రచించి
యీమృదులవీణమీఁద వాయించుకొనుచు
వాడవాడలఁ దిరుగుచున్నాఁడ నన్ను
నేరునుం బల్కరించినవారు లేరు.

అలసి యీవీణ తలక్రింద నవధరించి
నిదురపోదున ఎండ మండిపడు నేని
వీణ యిది నెత్తి కడ్డము పెట్టుకొందు
నొలయు వానలు దీనితో నొడ్డుకొందు.

నీపయిన నిన్నిగీతముల్ నిర్ణయించి
పలుకు నీవీణ యెండకు వాన కిట్లు
చివికిపోయి యేనాఁటికో శిథిలమైన
నది పలికినట్టి పాట లేహూనా కాని.

మనపరస్పరప్రేమసంబంధ మింత
దృఢతరం బౌటకును గత మేమొ యంచుఁ
గారణము లోకు లొకటొకటిగా నేరి తెచ్చి
తొలుత తొలుతనె కాదని త్రోసిపుత్తు.

పాప మిల్లు నిరాకరింపఁబడికూడ
నాయెడల నిత్యమును బ్రసన్నములెసుమ్ము
నీకు సౌందర్యశీలముల్ నీకులీన
తయును నీయిట్టిదగు నగాధంపుఁబ్రేమ.

ఇన్నినాళ్ళకుఁ దెలిసిన దీప్రణయపు
సుదృఢబంధకారణము నాయెడ విధేయ
మై పసితనంపునాఁటి పిత్రాజ్ఞ నెంచి
జననియనుమతి గని భక్తి వినత మయ్యె.

అమృతతరుపల్లవాభిరామార్ద్రమూర్తి!
నీకృపావేశమునఁ జేసి నీపదాంబు
జముల మ్రోగిన నాగానజనితరవము
వినఁబడియెఁ బ్రేమవాహినీవీథులందు.

అమితశృంగారరసవీథులందు నీకు
నవవసంతోత్సవంబులే చివురుఁబోడి!
ప్రణయసోపానముల నిలంబడి మదీయ
భావకన్యక నీకు నివ్వాళి పట్టు.

ఈనవమధూదయపువేళ నింతి! నిన్నుఁ
బ్రణయకోమలమాకందపాదపమ్ము
శీతలచ్ఛాయలందు వసింపఁజేసి
ముగ్ధభావప్రసూనాలు పూజ లిత్తు.

౧౦౦

మొగిలుచాటు శరజ్జ్యోత్స్న మొగిఁ బిశంగ
రుచులు వెదజల్లుపథముల విచికిలార్ద్ర
గంధి! వలిపంపు పండుచెంగావిచీర
పై విలోచనాంతాంజనప్రభలు పర్వి.

పచ్చి నీమే నొకేసారి వార్షుకాభ్ర
లీనసౌదామనీపింగళిమము నంగు
లీవిలూనజపాపాటలిమము చలద
లీగరున్మోహనశ్యామలిమము తన్వి!

నననవసరస్వతీయమునాభగీర
థాత్మజావేణికాపూతయగు ప్రయాగ
వోలె సత్త్వరజస్తమోభూరిగుణస
నాథశాంకరివోలె నందగిలె దీవు.

౧౦౧

పడఁతి! నీప్రేమదారుల నడచి నడచి
పూవుల బజారులందునఁ బోయినట్లు
నవనవపరీమళ త్తనూనవ్యతామ
నోజ్ఞమూర్తిగ నెంచుకొందును లతాంగి

తరుణి! మన్మనఇంద్రియద్వారమున భ
వత్ప్రవేశవాంఛాలవేశప్రచలిత
మైన నాయాత్మఁ జొచ్చు నీయమృతవాస
నానిలమ్ములు పోసికొన్నవి పురంధ్రి!

నాసొగసుటింటఁ జిన్నిరత్నంపుదీప
మిడికొనినరీతిఁ బదునుచేయించుకొన్న
నాదుపొలమున సురగంగ బోదె కొడుగు
లీల నాయాత్మ నీవు వెల్గించినావు.

## ౧౦౨

తుంగగిరిసానువుల మహోద్ధృతతరంగ
మాగిరికుమారకుని ప్రేమవేగ మదియు
ఆఁకట్టల కౌగ్గి నీయందుఁ జేర్చు
నింత చిఱువాకలై ప్రవహించె చూడు.

నిలుకడలుపడ్డ యా ప్రేమకొలఁకులకును
కెలఁకులను బూచె శతపత్ర మలఘుతరము
ముగ్ధరమ్యమ్ము కానుక పుచ్చుకొమ్ము
కోసి తెచ్చితి దీని నీకొఱకు నేఁడు.

ఇది సభక్తిక మర్పిత మిది భవచ్ఛి
రంబునను నీదుమోముపై వ్రాలి దేవి!
శారదాఫాలబాలశశాంకరేఖ
వలెఁ జెలంగె నాపూర్వతపస్సుచేత.